రించితిని. బెజవాడ శాసనశిలయందలి మాచల్దేవిచిత్రమును గూడ పరిశీలనమునకై వ్రాయించి జతపరచితిని.

అప్పుడు ఓరుగల్లునగర మెంత వైభవముతో నుండె డిదో నేడంతయుఁ బాడుపడి పోయినదికదా! ఈ క్రీడాభి రామమేని దానిని బునరుద్ధరించు గాక !

దీపావళి .
20-10-1960.

విద్వద్విధేయుఁడు
వేటూరి ఆనందమూర్తి



శ్రీః

# క్రీడాభిరామము

---

## కృత్యవతరణిక

గణన కెక్కినదశరూపకములయందు
* వివిధ రసభావభావన వీథి రెస్స
యే కవీంద్రుఁడు రచియించె నీ ప్రబంధ
మనుచు మీ రానతిచ్చెద రైన వినుఁడు.

## కృతికర్త వంశవర్ణన

సీ. అఖిలప్రపంచంబు నన్యథా కల్పించెఁ
బటురోషరేఖ సాఫల్య మొందఁ
ద్రైశంకవం బైనతారకామండలం
బాకాశమార్గంబునందు నిలిపె
మాలినీతీరనిర్మలసైకతములలో
మేనకాప్సరసతో మేలమాడె
నామ్నాయమాత గాయత్రీమహాదేవిఁ
బ్రణుతించి బ్రహ్మర్షిపదము గాంచె
నెవ్వఁ డాతండు సామాన్యఋషియె తలఁపఁ
దాటకాకాళరాత్రికి దాశరథికిఁ

గాలకంధరకోదండఖండనునకుఁ
గార్ముకాచార్యవర్యుండు గాధిసుతుఁడు. 2

స్ర. ఆ విశ్వామిత్రుగోత్రం బనుజలనిధి యా
హ్లాదముం బొందుచుండన్
భూవిఖ్యాతప్రభావాభ్యుదయుఁ డు
దయముం బొందె *యంచన్న కీర్తుల్
ద్యావాపృథ్వ్యంతరాళాంతరముల
నతివిస్తంద్రచంద్రాతపశ్రీ
ధావళ్యస్ఫూర్తి లక్ష్మీతరళతరకళా
ధౌళధళ్యంబు సూపన్. 3

శా. ఆ మంత్రీశ్వరుకూర్మినందనుఁడు చం
ద్రామాత్యుఁ డంభోజభూ
భామారత్నపయోధరద్వయతట
ప్రాలంబవై పథ్యము
క్తామాణిక్యవిభాభిరూప్యపదవా
క్యప్రౌఢసాహిత్యవి
ద్యామాహాత్మ్యవిలాసపమ్మదిత వి
ద్వన్మానసుం డిద్ధరన్.

* "మంచన్న" అని యుండునేమో.

శా. కర్ణాటక్షితినాథుఁ డైనపెదబు
క్కక్ష్మాపదేవేంద్రు న
ర్థ్యర్ణామాత్యుని దానఖేచరునిఁ జం
ద్రాధీశు బంధుప్రియున్
వర్ణించున్ గవికోటి శంకరజటా
వాటీతటాంతర్నదత్
స్వర్ణద్యంబుతరంగరింగణలస
త్సాహిత్యసౌహిత్యమై. 5

క. ఆచంద్రమంత్రిమణికిని
బోచాంబారత్నమునకుఁ బుట్టెను బుధర
క్షాచణుఁడు మంచనార్యుఁడు
వాచస్పతిసదృశబుద్ధివైభవుఁ డగుచున్. 6

గీ. మంచనార్యుతిప్పమకును సుపుత్రులు
నలువు రెన్న సింగనయును దిప్ప
నయును మల్లనయును నయనీతిసత్కళా
న్వితుఁడు చెన్నమంత్రివిభుఁడు ననఁగ. 7

గీ. సింగనామాత్యసుతుఁడు సుస్థిరగుణుండు
మానినీమన్మథుఁడు చంద్రమంత్రివరుఁడు
వెలసె వైభవముల దేవవిభునిఁ బోలి
సకలబుధతతి యెల్లను సంస్తుతింప. 8

క. మిరుతూరివిట్ఠమంత్రీ
శ్వరుతనయ వరించె మల్లనసచివాగ్రణి శం
కరుఁ డద్రిరాజనందనఁ
బరిణయ మగుభంగి నధికభాగ్యోన్నతుఁడై. 9

ఉ. మల్లనమంత్రికిం ద్రిపుర
మాతరళాక్షికిఁ గాంతిరోహిణీ
వల్లభు లాత్మసంభవులు
వల్లభలింగనతిప్పనక్షమా
వల్లభమంత్రిశేఖరులు
వారవధూజనపుష్పభల్లు లు
త్ఫుల్లయశోవిభాసితులు
పుణ్యులు సింగనభైరవేంద్రులున్. 10

వ. అందు 11

సీ. తారకామందారతారాచలంబుల
తోఁ రాయు నెవ్వానిచారుకీర్తి
భావసంభవభద్రదేవేంద్రసూనుల
మఱపించు నెవ్వానిమహితమూర్తి
జీమూతవాహనశిబిసూర్యతనయుల
ధట్టించు నెవ్వానిదానశక్తి
భార్గవగార్గ్యగీష్పతిమతిప్రౌఢిమ
విరసించు నెవ్వానివిశదబుద్ధి

యతఁడు రిపురాజరాజ్యసప్తాంగహరణ
కరణపరిణతయుక్తిప్రకాశమానుఁ
డతులితాచారవిజితగంగాత్మజుండు
మర్త్యమాత్రుండె వల్లభామాత్యవరుఁడు. 12

సీ. వాచాలసురధునీవీచికాగంభీర
. వాచావిలాసుఁడు శైవమంత్రి
పల్లవోష్ఠీమానసోల్లాసకృతిపుష్ప
భల్లావతారుండు మల్లవిభుఁడు
పన్నగాలంకారపన్నీరజధ్యాన
సన్నుతాత్ముండు పోచన్నశౌరి
ప్రత్యగ్రసహజసాహిత్యవిద్యాకళా
న్నత్యుండు తిప్పనామాత్యఘనుఁడు
నందనులు చంద్రమందారకుందకుముద
గంధకీగంధసారసౌగంధ్యబంధు
బంధురోదారకీర్తి సౌభాగ్యనిధికి
మల్లికార్జును సు[illegible]కులవల్లభునకు. 13

మ. కనకాద్రిప్రతిమానధైర్యనిధి లిం
గమ్మపమంత్రీంద్రుతో

---

* 'సుసుతునకు' అని యుండవచ్చును.

ననతారాతినృపాలమంత్రిజనతా
హంకారతారాహిమా
ర్కునితో రూపరతీంద్రుతో హరిహర
క్షోణీంద్రసామ్రాజ్యవ
ర్ధనుతో సాటి సమాన మీదు గలరా
రాజన్యసైన్యాధిపుల్. 14

గీ. తిప్పమంత్రి జగదుదీర్ణవితీర్ణుఁ డు
ద్వాహ మయ్యె నధికవైభవమున
హరితగోత్రజలధిహరిణాంకుఁ డగు తిప్ప
నార్యతనయఁ బెద్దమాంబ నెలమి. 15

పుత్రుం
స్ర. ఆమల్లామాత్యవర్యుం* దయుగనయనపూ
జానుసంధానసంధా
సామగ్రీపుండరీకేక్షణుఁడు వెలసె నై
శ్వర్యసంపత్సమృద్ధిన్
పీమాదంతావళాభ్యుచ్ఛ్రితకరటతటి
క్షేత్రవిర్యన్మదాంభస్
స్తోమవ్యాలోలభృంగస్తుతవిమలతర
స్ఫూర్తిసత్కీర్తి లక్ష్మిన్. 16

* 'మాత్యపుత్రుం దయుగ' అని యుండునేమో।

సీ. సత్యవ్రతాచారసత్కీర్తిగరిమలఁ
జంద్రుతోఁడను హరిశ్చంద్రుతోడ
నభిమానవిస్ఫూర్తి నైశ్వర్యమహిమల
రారాజుతోడ రైరాజుతోడ
సౌభాగ్యవైభవజ్ఞానసంపన్నత
మారుతోడ సనత్కుమారుతోడ
లాలిత్యనిరుపమశ్లాఘావిభూతుల
భద్రుతోఁడను రామభద్రుతోడఁ
బాటి యనదగు ధారుణీపాలసభల
వీరహరిహరరాయపృథ్వీకళత్ర
రత్నభండారసాధికారప్రగల్భు
మల్లికార్జున త్రిపురారి మంత్రివరుని. 17

మ. కపటాచారవిరోధిరాజసచివ
గ్రావోగ్రదంభోళికిన్
నృపనీతివ్యవహారకార్యఘటనా
నిర్ధారణాశాలికిన్
దపనీయాచలరాజధైర్యవిధికిం
ధర్మైకపాథోధికిం
ద్రిపురారాతిమహాప్రధానునకు నే
రీ యుద్దు లిద్దారుణన్. 18

మ. అటవీసూకర మేల ? యేల ఫణి ? యే
లా కొండ ? లేలా దిశా
తటవేదండము ? లేల కూటకమఠా
ధ్యక్షుండు ? సప్తాబ్ధిసం
ఘటనాలంకృతమధ్య మైననిఖిల
క్ష్మాచక్రవాళంబు నె
క్కటి దాల్పం ద్రిపురారివల్లభభుజా
కాండద్వయం బుండఁగన్. 19

ఉ. గంధవతీప్రతీరపుర
ఘస్మరపాదబిసప్రసూనపు
ష్పంధయచక్రవర్తి శ్రుత
పర్వతదుర్గమహాప్రధానరా
డ్గంధగజంబు తిప్పన య
ఖండితధీవిధి కాంచెఁ బుత్త్రులన్
బాంధవకల్పవృక్షముల
బైచన*వల్లభతిప్ప మంత్రులన్. 20

వ. అందు 21

కృతికర్తృ ప్రశంస

సీ. మూఁడుగ్రామగ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ముల్కినాట

* 'వల్లభ' అని యుండవలెను.

నాశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించెఁ
బ్రత్యక్ష మొనరించి భైరవస్వామిచే
సిద్ధసారస్వతశ్రీ వరించెఁ
గామకాయనసవిశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్తకెక్కె
నెవ్వఁ డా త్రిపురాంతకాధీశ్వరునకు
రాయనవరత్నభండారరక్షకునకుఁ
బ్రియతనూజుండు చందమాంబికకు సుతుఁడు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు. 22

క. అహరవధిసమయనృత్య
తుహినాంశుధరప్రచారధూతాభ్రధునీ
లహరీభ్రమఘుమఘుమముల
వహిఁ దిప్పయవల్లభన్న వాగ్వైభవముల్. 23

క. హాటకగర్భవధూటీ
పీటీకర్పూరశకలవిసృమరసౌర
భ్యాటోపచాటుకవితా
పాటవ మరు దవని వల్లభన్నకు నమరున్. 24

క. హల్లీసకనటనోద్భట
వల్లవహారికృష్ణకంఠవనమాల్యమిళ

ద్గల్లత్సురభులు తిప్పయ
వల్లభరాజప్రధానవాగ్వైభవముల్. 25

క. అమృతరసమథనసంభవ
ఘుమఘుమితపయఃపయోధికోలాహలముల్
భ్రమియించుఁ దిప్ప సచివో
త్తమువల్లభవిభునిచాటుధారాఫణితుల్. 26

క. భిల్లావతారమధుభి
ద్భల్లభుజాస్ఫాల్యమానపటుచాపజ్యా
వల్లీమతల్లి చెల్లెలు
వల్లభరాయప్రధానవాగ్వైభవముల్. 27

క. నెల్లూరితూముకాలువ
హల్లకములకమ్మఁదావి నపలాపించుల్
సల్లలితలీలఁ దిప్పయ
వల్లభరాయప్రధానవాగ్డంబరముల్. 28

క. ఉపమించెద ధారాధర
తపనజ రైరాజ రాజ ధారానగరా
ధిప ధారాధరవాహులఁ
ద్రిపురాంతకవల్లభునివితీర్ణిప్రౌఢిన్. 29

క. పరివత్తు రీవి విర్థర
పరివృఢమణి ధనద జలద బలి ఖచర విభా

కర సురతరు సురధేనువు
లరుదై త్రిపురారివల్లభామాత్యునకున్. 30

శా. పారావారమునన్ వివేకసరణి౯
సౌభాగ్యభాగ్యంబుల౯
ధౌరంధర్యమునం బ్రతాపగరిమ౯
దానంబున౯ సజ్జనా
ధారుం దిప్పనమంత్రివల్లభు నమా
త్యగ్రామణిం బోల్పఁగా
వేరీ మంత్రులు సింధువేష్టితమహో
ర్వీచక్రవాళంబున౯. 31

సీ. మందారవారుణీమదఘూర్ణితాత్ముచే
వెడఁదకన్నుల చిన్నివదువుచేత
డమరుఖట్వాంగదండకపాలపాణిచే
ధూర్తపాలకచక్రవర్తిచేతఁ
గుక్కురపరివారకోటిసేవితునిచే
వెలఁదికోఱలమోము వేల్పుచేత
(చరణము కొఱఁత)
విశ్వవిశ్వంబు పాలించువిభునిచేతఁ
పార్వతీదేవిగారాపుఁబట్టిచేత

వీప్పితము గాంచుఁ దిప్పమంత్రీంద్రతనయుఁ
డార్యమణి వల్లభామాత్యుఁ డహరహంబు. 32

## ప్రేమాభిరామప్రశంస

వ. ఆ మంత్రిశేఖరుండు రావిపాటి త్రిపురాంతకదేవుం డను కవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామనాటకంబు ననుసరించి క్రీడాభిరామం బనురూపకంబు తెనుంగుబాస రచియించినవాఁడు. 33

గీ. అతఁ డెంతటివాఁడు ప్రేమాభిరామ
మనఁగ నెంతటియది దాని ననుసరించి
వీథి యనురూపకము మది వెఱపు లేక
తిప్పవిభువల్లభుం డెట్లు తెనుఁగుఁ జేసె. 34

వ. అని యానతిచ్చెదరేని 35

ఉ. నన్నయభట్టతిక్కకవి
నాయకు లన్న హుళక్కిభాస్కరుం
డన్నను జిమ్మపూఁడి యమ
రాధిపుఁ డన్నను సత్కవీశ్వరుల్
వెన్నుదుటం గరాంజలులు
వింతురు జే యవి రావిపాటి తి
ప్పన్నయు నంతవాఁడ తగు
నా యిటు దోసపుమాట లాడఁగన్. 36

---

* "దార్యమణి" అని యుండవచ్చును.

గీ. జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందుఁ దెనుఁగు లెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చుటాఁడుబిడ్డ మేలుగాదె. 37

వ. నేపథ్యమున 38

## కథాప్రస్తావన

చ. గతిరసికురంగ! షట్చరణ!
గానకళాకమనీయ! యోమధు
వ్రత! వికచారవిందవన
వాటిక నేమిటికిం బరిత్యజిం
చితి వటవీప్రదేశమునఁ
జెట్టులు వేమలు నేమి గల్గినన్
బతిచెడి సంచరించెదవు
ప్రాఁబడిపోయెనె నీ వివేకమున్. 39

గీ. చేర వచ్చివచ్చి దూరంబుగాఁ బోదు
డాయవత్తు దవ్వు పోయిపోయి
మాట లింక నేల మాపాలిటికి నీవు
మాయలేడి వైతి మంచిరాజ! 40

వ. ఆకర్ణించి సూత్రధారుఁడు హా! యే నెఱింగితి నేకశిలా
నగరంబునం దార్యవాటంబునం గామమంజరి యను

పునర్వసువునందు బద్ధానురాగుండై కార్యాంతరవ్యాసంగంబునం దేశాంతరగతుం డైనకానసల్నాటి గోవిందమంచనశర్మ నుద్దేశించి యమ్మద్దియ పుత్తెంచిన యసంబంధీభూతప్రేమసంధుక్షణాగర్భంబైన మదనలేఖ సందేశపద్ధతి యది పఠియించుచున్నవాఁ డతని కట్టనంగుఁజెలికాఁడు టిట్టిభసెట్టి గావలయు నయ్యిరువురు నాబాల్యమిత్రంబులు వీరి యోగక్షేమంబు లనుసంధించెదంగాక యని నిష్క్రాంతుఁడయ్యె నిది ప్రస్తావన. 41

సీ. గన్నేరుఁబూచాయ కరమొప్పు నీర్కావి
మడుఁగుదోవతి పింజె విడిచి కట్టి
గొజ్జంగిపూవీరు గులికి మేదించిన
గంగమట్టి లలాటకమునఁ దీర్చి
వలచేత బంగారుజలపోసనముతోడఁ
బ్రన్ననిపట్టుతోరము ధరించి
జటిగొన్న వెలిపట్టుజన్నిదంబులతోఁగ
యంటులు వాయంగ నటుత వైచి
తళుకుచెంగావికోకయు వలుఁదశిఖయుఁ
జిగురుబొమ్మంచుపెదవులు చిన్నినగవు
నంద మొందంగ వచ్చె గోవిందశర్మ
మాధవునిపట్టి యొసపరిమన్మథుండు. 42

క. కొసల్నాటిశ్రేష్ఠుఁడు
మీసాలప్పయ్యగారి మేనల్లుఁడు ధా
త్రీసురతిలకుఁడు కుసుమశ
రాసనసముఁ డంధ్రనగరయాత్రోన్ముఖుఁడై. 43

వ. తూర్పుఁ గనుంగొని టిట్టిభునిం జూచి వయస్య ! సుప్రభాతంబు. సుఖనిద్ర యయ్యెనే ? శీతం బుపద్రవంబు వాయదుగదా యీ పుష్యమాఘంబులందు. 44

## చలి

ఉ. ప్రక్కలు వంచివంచి ముని
పండ్లును బండ్లును రాచిరాచి తో
మ్మక్కులఁ జేసిచేసి తల
యల్లనఁ గాళ్ళకు నందియంది లో
చక్కికి నొక్కినొక్కి యిరు
చంబడ గుమ్మడిమూట గట్టి పీ
పెక్కి దువాళిచేసి చలి
యిక్కడ నక్కడఁ బెట్టు వేకువన్. 45

ఉ. కుమ్ములు హవ్యవాహములు
గుత్తపుసుగ్గడితరపుఁదోఁపురెం
టమ్ములు దట్టుపున్గు మృగ
నాభియుఁ జాఁదును నోడె వద్దిరా

యమ్మకచెల్ల ! యింక నవ
యౌవనదర్పనఖంపచంబు లో
కొమ్మలచన్నులన్ సరకు
గో నటు లున్నవివో తుషారముల్. 46

శా. స్థూలద్విత్రిపటావకుంఠనముఁ గ
స్తూరీరజఃపాలికా
కాలాగుర్వనులేపనంబులను ను
ద్ఘాటించి ధాటీగతిన్
ప్రాలేయంబు దువాళి నేసిన భయ
భ్రాంతంబులై యూష్మముల్
వాలాయంబుగఁ బ్రాఁకె సంభ్రవనితా
వక్షోజశైలాగ్రముల్. 47

శా. స్థూలద్విత్రిపటావకుంఠనములున్
ధూపోపచారంబులుం
గాలాగుర్వనులేపనంబులు వధూ
గాఢోపగూహంబులుం
గేళీగర్భనికేతనంబులును గ
ల్గెంగాక లేకున్న నీ
ప్రాలేయాగమ మెవ్విధంబున భరిం
పన్ వచ్చురా టిట్టిభా ! 48

వ. శీతోపద్రవంబు లేక సుఖనిద్ర యయ్యెనే యని యడిగి
వేకువ యగుచున్నయది గావున విదియ మనకుఁ
బ్రస్థానకాలం బని నిమిత్తం బనుసంధించి 49

శకునములు

ఉ. చుక్క యొకింత నిక్కి బల
సూదనుదిక్కున రాయుచుండుటన్
జక్కఁగ వేగ దిప్పుడు ని
శాసమయం బిది ప్రస్ఫుటంబుగా
ఘుక్కని మాటిమాటికిని
గ్రోటఁడు వల్కెడు వామదిక్కునం
జొక్కటమై ఫలించు మన
శోభనకార్యము లెల్లఁ డిట్టిభా ! 50

క. మాఁగిలి మాఁగిలి వృషము
పూఁగొమ్మననుండి షడ్జము ప్రకాశింపన్
లేఁగొదమనెమలి పల్కెడుఁ
గేఁగోయని వైశ్య మనకు గెలుపగుఁ జూమీ. 51

గీ. కొనకొనం గోడి యేట్రింత కొంకనక్క
నమలి యీనాలుగిటిదర్శనంబు లెప్ప
వీనివలతిరుఁబలుకు మర్త్యజనులకుఁ
గొంగుబంగార మంత్రు శాకునికవరులు. 52

## కోడికూఁత

వ. అనిన నాకర్ణించి టిట్టిభుండు 53

ఉ. మంచన వింటివో వినవొ
మన్మథుఁ డేకశిలాపురంబులోఁ
జంచలనేత్రలం బతుల
శయ్యలపై రతికేలి రాత్రి పో
రించి ప్రభాతకాలము ప
రిస్ఫుట మైనను ధర్మదార వ
ట్టించుచున్నవాఁ డదె కు
టీగతకుక్కుటకంఠనాళముల్. 54

వ. అని యట వోయి ముందట. 55

గీ. శీతకాలంబు కడి మాఁద నేయఁ గుడుచు
భాగ్యవంతుండు తేపాడి పల్లెపట్లఁ
గ్రొత్తయోరెంబు విగురావకూరతోడఁ
బిచ్చిలం బైననేతితోఁ బెరుఁగుతోడ. 56

## ఒక ముచ్చట

వ. టిట్టిభ ! తలంపునం బాఱె నొక్కనాఁ డేనునుం గామ
మంజరియును బ్రేమంబెలర్పఁ గలసిమెలసి కూడిమాడి
పొందిపొసఁగి యనఁగిపెనఁగి చొక్కి తక్కియుండ
దైవవశంబున గోత్రస్ఖలనంబు కారణంబుగా నక్కాంతా
రత్నం బలిగిన 57

గీ. ఎట్టకేలకు నలుక రే యెల్లఁ దీర్చి
యువిద యధరామృతము గ్రోలుచున్ననాకుఁ
దానవిఘ్నంబుగా మ్రోసెఁ దాపజాతి
జాతిచండాల మైనవేసడపుఁగోడి. 58

వ. టిట్టిభ! యమ్మదనపట్టాభిషేక మత్తేభరాజగమన వట్ట
నడుమ సురతకాలంబున వసంతసమయంబునం దాసి
మల్లికాధవళాట్టహాసమహాకాళమూర్తి యగు తపర్తు
సమయంబు లంఘించి లాంగలీకుసుమకేసరపరాగ
రేణువిసరపిశంగితదశదిశాహట్టం బగువర్షానమయం
బెట్టకేలకుం గడపితిఁ బ్రావృట్కాలప్రవాసంబును మర
ణంబును రమణీరమణులకు నొక్కసమంబ యది యెట్టి
దనిన. 59

మ. పటురుంరూపవనోత్పలాలయములో
భద్రంబునం బట్టెకం
కటిపై ముచ్చముడింగి విర్భరవియో
గగ్లాని శోషించి యె
క్కటి నిద్రింపుచు నున్న పాంథవనితల్
గర్జావచఃప్రౌఢిమల్
దటిదుద్ద్యోతము చూపు నట్టనడురే
ధారాధరశ్రేణికిన్. 60

వ. అని మంచన మఱియును బ్రాగ్దిశాంచలము వీక్షించి. 61

## అరుణోదయము

గీ. దాసనపుఁబువ్వుచాయతోఁ బ్రస్తరించు
చుదయ మయ్యెడు నదె చూడు మొదలినంజ
సొబగు పీడివఁ గట్టెఱ్ఱ సోఁకినట్టి
కామమంజరి నెమ్మోముకాంతివోలె. 62

## సూర్యోదయము

మ. అదె మాణిక్యపుఁబూర్ణకుంభము వయ
స్యా! కార్యసంసిద్ధికై
మొదలం దోఁచినయట్టి మంచిశకునం
బుం గా విచారింపరా
యుదయం బయ్యెడు భానుబింబము దిశా
వ్యోమావకాశంబులం
బదియార్వన్నెపసిందితీగలగతిన్
బ్రాఁకెం బ్రభాజాలముల్. 63

శా. ఓరుంగంటిపురంబుసౌధములపై
నొప్పారెడిన్ జూచితే
యీరెండల్ మణిహేమకుంభములతో
నేకాంతముల్ వేయుచున్

స్వారాజ్యప్రమదాఘనస్తనభర
స్థానంబులం బాసి కా
శ్మీరక్షోదము ప్రాణవల్లభదృఢా
శ్లేషంబులన్ రాలె నా. 64

వ. అనుదితనియమవ్రతంబు గావున నిట క్రితంబ సంధ్యాగ్ని హోత్ర క్రియాకలాపంబులు నిర్వర్తింపంబడియె నీవు ముఖమజ్జనంబు నేసి యిష్టదేవతాభివందనంబు గావిం చితివిగదా గోధూళిలగ్నంబునం బురంబు ప్రవేశింప వలయు విశేషించి యుషఃకాలంబు సర్వప్రయోజనా రంభంబులకుఁ బ్రశస్తంబు. 65

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము. 66

వ. అని పరిక్రమించి వెలిపాళెంబు కట్టకడపటఁ గటకార కుటీరవాటికఁ బ్రవేశించి. 67

## మేదరవాడ

సీ. ఎకసెక్కెముగ నాడు నేదైన నొకమాట
పాడు నొయ్యన పాట పాటపాట

యలఁతియద్దపుబిళ్ళ యలవోక వీక్షించుఁ
గావగోరఁ బదవిచ్చి కురులు దీర్చుఁ
బయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు
దిస్సువాఱఁగ నవ్వుఁ దీఁగనవ్వు
ధవళతాళపలాశతాటకంబులు త్రిప్పు
కలికిచూపులఁ జూపు గర్వరేఖ
కటకుటీద్వార [illegible] వైణవ కాష్ఠపీఠ
మధ్యభాగవిషణ్ణయై మదము మిగిలి
పీటి పామరవిటుల తంగేటిజున్ను
కాముబరిగోల మేదరకరణవేశ్య. 68

క. పుటభేదనబహిరంగణ
కటకశ్రీ కారకూటకటకం బగుచీ
కటకారకులవధూటీ
కుటికాగారంబు గరడి కుసుమాస్త్రునకున్. 69

క. కీసివ వెదురుసలాకల
నేసిన యిరుఁదల శిఖండి నిడుమంచమునం
దోసరిలి కటకుటీరవి
లాసిని రమియించు మిండలసహస్రములన్. 70

ఉ. పల్లవతస్కరుం డొకఁడు
ప్రాక్సముపార్జితతారపం క్తితో

వల్లవ మె_త్తికొంచుఁ బెద
వాకిట వెళ్ళిననాఁటమండి పా
టిల్లినశంక వీకటకు
టీరవిలాసిని యహ్హాహా! పటీ
పల్లవకోణముల్ బిగియఁ
బట్టి రమింయను మిండగీలతోఁ. 71

వ. ఆచేడియం జూచి యట పోవంబోవ ముందట. 72

చండాలాంగన

శా. గండాభోగముపజ్జ లేనగవు శృం
గారింపఁ గ్రేఁగన్నులఁ
మెండై మించుమెఱుంగుఁజూపుగమి క్రొ
మ్మింంచుల్ పిసాళింపఁగాఁ
జండాలాంగన వచ్చె నొక్క_తె ఋతు
స్నానార్థమై యిక్షుకో
దండుం దేర్చినబాణమో యనఁగ సౌం
దర్యంబు విండారఁగఁ. 73

వ. అట్లు పోవం బోవ ముందట. 74

కర్ణాటి

మ. కటిభారంబును జన్నుదోయిభరముఁ
గల్పించె నాబ్రహ్మ పి

న్నటి కౌఁదీఁగకు మున్న యప్డ విమలా
ర్ణఃపూర్ణమై యున్నయీ
ఘటిభారం బొకఁ డెక్కు దయ్యో నవినఁ
గర్ణాటి క్రాగ్గిన్నులఁ
బటితాళింపుచు నవ్వె నీలకబరీ
భారంబు కం[illegible]గాఁ: 75

వ. అనుచు గోవిందమంచవశర్మ నర్మసఖుం డగుటిట్టి ఖండును దానును హట్టమార్గంబునం జనునప్పుడు. 76

గీ. జిగురుటుండలు నించి దాచేతియందుఁ
బెద్దయేనుఁగుదంతంబు పెట్టెఁ బెట్టి
యింతులకుఁ బ్రీతిగా మైలసంతలోన
సుసరభేత్తని ఘోషించె జోటి యొర్తు. 77

వ. ఇది యేమి ఘోషించుచున్నయది కిరాటకులరత్నంబ! నీవు తేటపడ నెఱింగి మాకు నెఱింగింపుమనుచు మంచనశర్మ యడిగిన. 78

చ. ముసిముసినవ్వుతో నతని
మోము గనుంగొని పైకుఁ డిట్లనుఁ
రసికకులావతంసుఁడవు
బ్రాహ్మణ! యింతకుము న్నెఱుంగవే?

యసమశరాలయంబునను
హ_త్తినవెంద్రుకకప్పు వోవఁగా
విసరుసమీరణం బయిన
వేడుక మం దిది గొంచు రంగనర్. 79

సీ. కమఠావతారంబుఁ గైకొన్న దైత్యారి
కమనీయచరమభాగంబువోలె
నాదియుగంబునం దావిర్భవించిన
జిననాథదేవునిశిరసువోలెఁ
గసటు వోవఁగఁ దోమి కడిగి బోరగిలంగఁ
బెట్టినతామ్రంపుబిందెవోలెఁ
గంగమట్టియతోడ సాంగత్య మెడలిన
సీనుపారుమునిమిటనుదురువోలె
జిఱుత ప్రాయంపునాఁటిసజ్జికపుఁజాయ
తొలుసమ_ర్తయకాలంపువిలసనమునఁ
దరుణులకుఁ బంచబాణమందిరము లమరు
సునరభే_త్తనునీమందు సోఁకినపుడు. 80

వ. ఇది విర్యాసమయంబును సరభేదన సమర్థంబును నగుటంజేసి సునరభే_త్తనునామంబు దీనికిం గలిగెఁ గామనిలయాఘాట రోమాటవీ సముత్పాటన పరిపాటికై పాటలగంధులు దీనిం బాటింతు రనుచు నెఱింగించి

యట పోవంటోవ ముందంట వెలిపాళెంబు మధ్య
ప్రదేశంబున హాళికవాటియందు నొక్క చక్కని జవ
రాలు కట్టెఱతొగరుంగఱ్ఱల యొల్లియమ్మెఱ్ఱ గలనిశంబ
భారంబున నమర్చి బాలార్కకిరణసంపర్కంబునఁ
జాంపేయ కుసుమచ్ఛదచ్ఛాయాదాయాదంబు లైనయవ
యవంబులు మిసమిస మెఱవం గుక్కుటాసనంబునం
గూర్చుండి. 81

## పామరభామ

ఉ. కందుకకేళి నల్పెదుప్ర
కారమునం బురుషాయితక్రియా
తాండవరేఖ చూపెదువి
ధంబునఁ బామరభామ లేఁతయా
రెండప్రభాతవేళ రచి
యించె నితంబభరంబుఁ జన్నులన్
గుండలముల్ గుఱు ల్కదల
గోమయపిండము లింటిముంగిటన్. 82

వ. అప్పామరభామారత్నంబు నుద్దేశించి. 83

గీ. పొలపములు లేవు కరివంకబొమలయందుఁ
జిన్నినగవులు లేవు లేఁజెక్కులందుఁ
గలికితనములు లేవు క్రాల్గన్నులందుఁ
గాఁపుటిల్లాండ్ర కిట్టిమౌగ్ధ్యముల యొప్పు. 84

వ. అటచని వీథీవిటంకంబునఁ దిట్టిభుండు విటపేటికా ప్రకామ(ర?)ఘటిత కృకాటికావికట చేటికానుయాత యగుకర్ణాటాంగనం గనుంగొని. 85

కర్ణాటాంగన

మ. కుసుమం బెట్టినచీరకొంగు వొలయం
గ్రొవ్వారుపాలిండ్లపైఁ
ద్రిసరంబుల్ పొలుపార వేణి యవటూ
ద్దేశంబుతో రాయ వ
ప్పన మెవ్వాఁడొ యొకండు రాత్రి సురత
ప్రౌఢిం దనుం దేర్చినన్
వసివాళ్ వాడుచు వచ్చుచున్నయది క
ర్ణాటాంగనం జూచితే. 86

గీ. వాహకుం దెక్కి విడిచినవారువంపుఁ
గొదమయునుబోలి రతికేళిమదము దిగ్గ
యలసభావంబుతోడఁ గర్ణాటవేశ్య
వచ్చుచున్నది యదె విప్రవర్య కంటె? 87

ఉ. ఈమరి యింక నొక్కమరి
యింకొకమాఱఁకనొక్కమాఱు నా
నోములపంటగా యనుచు
నోవులఁ బెట్టుచు(ఽ) రే యొకండు నా

జ్జాములు దీవితోఁ గుసుమ
సాయకతంత్రము పల్పఁబోలు లే
దా మృగశాబనేత్ర యఖి
లాంగకముల్ వసిష్ఠవాళ్ల వాడునే ? 88

వ. అవిన మందస్మితంబుతో గోవిందమంచనశర్మ నర్మ
గర్భంబుగా దర్భాంకురాలంకృతంబు లగుతనకరపంక
జంబులం గర్ణపుటంబులు ముట్టుకొని పూతిమాషగోత్రం
బును మంచననామధేయంబునుం జెప్పి నమస్కరించి
యిట్లనియె. 89

శా. పంచారించిన నీ పయోధరము లా
స్ఫాలింతునో ; లేఁత బొ
మ్మంచుగెంజిగురాకుమోవి జిసిధా
త్వర్థం బనుష్ఠింతునో ;
పంచాస్త్రోపనిషద్రహస్యపరమ
బ్రహ్మస్వరూపంబు నీ
కాంచీదామపదంబు ముట్టుదునో ; యో
కర్ణాటశాటంకినీ ! 90

క. వ్రాలవి నీ చన్నులతో
వ్రాలెదుజక్కవలు పరియె ? వలలం బెట్టం

జాలెడునీకన్నులతో
వాలకి సదృశములె? వలలఁ బడుమత్స్యంబుల్. 91

శా. చాటుప్రౌఢిఁ బిసాళ మాదెదవు కా
సల్నాటిబాఁపందవో
కాటిహాటకనిష్కముల్ వెలిగ జం
ఝాటంబు చాలించు క
ర్ణాటస్త్రీలు కటారికత్తియలచే
రాపాడఁగాఁ బట్టఁగాఁ
దాటాలీడ గుణింపరాదు పెఱచో
టం బోలెఁ బైపాటునన్. 92

గీ. దిట్టబాఁపండు నడువీథిఁ దెగడి పలికెఁ
గూట మీక్షింపఁ దెమ్ము కిరాట నేఁడు
పన్నిదము వీవిమెడ నున్నజన్నిదములు
సవరగా గ్రుత్తుఁ గ్రొత్తపుంజాలదండ. 93

వ. అనుటయు విప్రుం డిట్లనియె. 94

సీ. మునుఁగు వెట్టిన నేమి ముత్యాలకమ్మల
క్రొమ్మించులీలలు గులుకరించె
మోము వంచిన నేమి మొలకనవ్వులకాంతి
చెక్కుటద్దములపైఁ జిరువాఱెఁ

జూచకుండిన నేమి సొబగుతెప్పల మించి
తేటవాల్మెఱుఁగులు దిచ్చరించెఁ
జాటు చేసిన నేమి చక్రవాకులఁ దోలు
పాలిండ్ల మెఱుఁగులు బయలుపడియె
సిగ్గు నటియించి మావేడ్క చిన్నఁబుచ్చి
యేల యిటు పిసాళించె దిం దేమి సిద్ధి
కాముసామ్రాజ్యపట్టంబు గట్టి నన్ను
గౌఁగిలింపంగఁగదవె యోకరణకాంత. 95

వ. అని చిఱునవ్వు నవ్వుచు గోవిందమంచనశర్మ నర్మసఖుండును దానును నట పోవఁ బోవ ముందట. 96

జూదము

మ. పరివేష్టించి ప్రజాకదంబకము పై
పై వ్రాలి వీక్షింపఁగాఁ
బరహస్తంబున నొత్తుకాండ్రు నపలా
పప్రౌఢి బోధింపఁ బా
మరులై పన్నిద మాడి యోడి మఱి దు
ర్మానంబుతో నాటగా
ల్విరి వేశ్యావలయాళిసంవళిత ము
వ్విళ్ళూర్చె గోవిందునిన్. 97

శా. సంగాసంగ జయాజయంబు పరిహా
స ప్రస్ఫుటాశ్లీల భా
షాంగం బాకలితాంతరావలయక
క్ష్యాభాగముద్రాలస
ద్భంగినిష్ఠితకాష్ఠశంకుకము పా
పద్యూత మీపన్నిదం
బంగీకారము వేయువారిమొలలం
బ్రాపించుఁ గౌపీనముల్. 98

గీ. నీకు నౌ నీకు నౌ నంచు నెమకి నెమకి
ముగుద లగువారి భ్రమియించి మోసపుచ్చుఁ
బశ్యతోహరుఁ డత్యంతపాపబుద్ధి
పట్టణములోఁ దగుల్పరిపందెగాఁడు. 99

వ. అనుచు నట ముందట శతానందగేహినీకరరుహ ప్రరోహ శిఖర ముఖరవీణాక్వాణ ప్రాణింధమం బైనమధుర స్వరంబున. 100

## కరణకాంత

సీ. విజ్జోడుపడ నిడ్డ వెంట్రుకజందెంబు
వలిగుబ్బపాలిండ్ల కెలఁకు లొరయఁ
గరమూలమున వెండి మొరవంకకడియంబు
మూఁడుమూలలలింగముద్ర లొత్త

జంగాళముగఁ బింజె సవరించి కట్టిన
మడుఁ గొంటిపోరను లోఁదొడలు మెఱయ
బలితంపువిచ్చుటాకులదుద్దుఁగమ్మలు
నిద్దంపుఁజెక్కులనీడఁ జూడ
నోరుఁగంటిపురంబులో నోరగ్రంతఁ
బెద్దమెలుఁగున నమ్మె సంపెంగనూనె
కోకిలము పంచమశ్రుతిఁ గొసరినట్లు
కనుమయవ్వలిదేశంబు కరణకాంత. 101

గానులకన్నె

గీ. పలికినప్పుడు తేనియ లొలికిపడెడు
జళుకుఁజూపులఁ గ్రొమ్మించు లులుకుపడెడు
ములికినాటిది కాఁబోలుఁ జెలి కిరాట
కలికి చిలుకలకొలికి యీ తెలికిజోటి. 102

ఉ. ఈనళినాక్షి దాఁ దిరుపు
పెద్దు ప్రతోదము మోపి రొప్పుచుఁ
గానుగపట్టెపైఁ దిరుగఁ
గట్టఁడిఁ జిట్టిభ! మందరాద్రిమం
థానకమథ్యమానతిమి
ధామజలభ్రమిమండలం బధి
ష్ఠానముగా భ్రమించునల
సంపదచేడియఁ బోలకుండునే. 103

ఉ. మీనవిలోచనంబులను
మీఁటిన ఖం గనుగుబ్బచన్నులం
పైనవచోమృతంబు సొగ
సైనమదాలసమందయానముం
గా నొనరించి దీని గణి
కామణిఁ జేయక నిర్దయాత్ముఁడై
గానులదానిఁ జేసినవి
కారవిధిం దలమొత్తఁగాఁ దగుఙా. 104

వ. అట యుత్తరంబునం గత్తెరనొత్తి పెక్కువన్నెల పొత్తుల బహువిధవర్తనల హత్తించి యెత్తి కట్టిన పూగొత్తులు మత్తకోకిలకలహంసదాత్యూహవ్యూహంబులుం గలిగిన మోహరివాడ* యందు. 105

కుట్రపువాఁడు

చ. కొలుచును జేనవెట్టి కుచ
కుంభయుగం బెగడిగ్గఁ గన్నుఁగ్రే
వలఁ బరికించుఁ గక్షముల
వైచును దృష్టులు మాటిమాటికిం
గలికితనంబునం దఱచు
.గా నగు సౌచికపల్లవుండు గం
చెల వెసఁ గుట్టి యూఁడు వెల
చేదియకుఙా విషయాభిలాషియై. 106

* చూ. అనుబంధము.

వ. అనుచు నవ్వాడ గడచి యట యుత్తరంబు సను నప్పుడు ముందట నొక యింటిమఱుంగున మచ్చె కంటిం బొడగని. 107

## ఊరీర్పుటు

ఉ. సారెకు సారె కేమిటికిఁ
జంపెదు గోరఁటయెఱ్ఱ లైనవా
లారునఖాంకురంబుల వ
యస్యకచంబునఁ బాటపాట యీ
రీరిచి సీత్కృతుల్ చెవుల
కిం పొనరింపఁ జకోరనేత్ర ! నీ
చారుకుచద్వయంబు మముఁ
జంపెడుదోసము నీకుఁ జాలదే ? 108

వ. అనుచు నయ్యింటిముందట; 109

## పసుపు నూఱుట

స్ర. పరిపాటీఖర్వఖర్జూపరతిసమయసం
భ్రాంతసంభోగభంగిన్
దరుణీరత్నంబు హేలాతరళగతి హరి
ద్రారజఃకర్దమంబుం
గురు లల్లాడంగ పీఁగుంగుచములు గదలం
గొంతు గూర్చుండి నూఱెన్

గరవల్లీకాచభూషాకలమధురరుణా
త్కారముల్ తోరముల్గాఁ. 110

వ. అని యచ్చోటు వాసి బాహ్యకటకపీథీవిటంకంబు
లతిక్రమించి. 111

ఓరుఁగల్లు

సీ. సప్తపాతాళవిష్టపమహాప్రస్థాన
ఘంటాపథం బైనగనపరిఖ
తారకామండలస్తబకావతంస మై
కనుచూపు గొనవిప్రాకారరేఖ
పుంజీభవించినభువనగోళముభంగి
సంకులాంగణ మైనవంకదార
మెఱుఁగుతెక్కలతోడిమేరుశైలముఁ బోలు
పెనుపైఁడితలుపులపెద్దగవని
చూచెఁ, జేరెఁ, బ్రవేశించెఁ, జొచ్చెఁ, బ్రీతి
సఖుఁడుఁ దానును రథఘోటకకటకరటి
యూథసంబాధముల కొయ్య నోసరిలుచు
మందగతి నోరుఁగల్లు గోవిందశర్మ. 112

వ. ప్రవేశించి టిట్టిభనామధేయుం డైనకోమటిసెట్టిగారితో
నాతఁ డిట్లనియె. 113

సీ. రాజమార్గంబు వారణఘటాఘోటక
శకటికాభటకోటిసంకులంబు
ధరణీస్థలీరజస్త్రసరేణుబహుళంబు
గావున మన మందుఁ బోవవలదు
క్రంతత్రోవల నొండుగలకలంబులు లేవు
తఱచుగా సుఖవినోదములు గలవు
మఱియు విశేషించి మన్మథకూట మౌ
వేశవాటిక మధ్యవీథిఁ దఱిసి
చిత్తమున కెక్కునట్టిలంజియలతోడ
సరససల్లాపసౌఖ్యంబు సలుపవచ్చు
నంత మధ్యాహ్నసమయ మౌనపుడు గాని
వేడుకై యుండ దక్కలవాడ సొరఁగ. 114

గీ. అనినఁ డిట్టిభుఁ డౌ నంచు ననుచరింప
నాలువరిక్రిందిత్రోవగా నరిగి యరిగి
విప్రుఁ డీక్షించెఁ బలినాటివీరపురుష
పరమదైవతశివలింగభవనవాటి. 115

పల్నాటివీరులకథ

మ. ద్రుతతాళంబున వీరగుంభితకధుం
ధుంధుంకిటాత్కారసం
గతి వాయింపుచు నాంతరాళికయతి
గ్రామాభిరామంబుగా

యతి గూడం ద్విపదప్రబంధమున వీ
రానీకముం బాడె నౌ
క్కాత ప్రత్యక్షరముం గుమారకులు ఫీ
ట్కారంబునం దూలఁగన్. 116

సీ. గర్జించి యరసి జంఘాకాండయుగళంబు
వీరసంబెట కోల వ్రేయు నొకఁడు
ఆలీఢపాదవిన్యాస మొప్పఁగ వ్రాలి
కుంతాభినయముఁ గైకొను నొకండు
బిగువుఁగన్నుల నుబ్బు బెదరుఁజూపులతోడ
ఫీట్కార మొనరించుఁ బెలుచ నొకడు
పటుభుజావష్టంభపరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాఁటు నొకఁడు
ఉద్ది ప్రకటింప నొక్కరుం డోల వాఁడు
బయలు గుఱ్ఱంబు భంజళ్ళఁ బఱపు నొకఁడు
కొడుము దాటింపుచును బెద్దగొలువులోనఁ
బడఁతి పల్నాటివీరులఁ బాడునపుడు. 117

గీ. కులముదైవతంబు గురిజాలగంగాంబ
కలవిపోతులయ్య చెలిమికాఁడు
పిఱికికండ లేవియఱువదియేగురు
పల్లెనాటివీర బాంధవులకు. 118

గీ. ఆరువెల్లినాయురాలిదుర్మంత్రంబు,
కోడిపోరు, చాపకూటికుడుపు
ప్రథమకారణములు పల్నాటియేకాంగ
వీరపురుషసంప్రహారమునకు. 119

ఉ. పచ్చనిపిండిగందమును
బాలము నేసయు నెత్తిపూవులన్
గ్రుచ్చిన కంఠమాల్యములు
గొప్పగ నల్లినవేణిబంధముల్
కుచ్చులవీరసంబెటయుఁ
గ్రొత్తమణుం గగుకాసెపుట్టమున్
అచ్చుల కెక్కినట్టిరవ
ణంబులు వీరకుమారకోటికిన్. 120

క. నల్లంగొండయు నాగరి
కల్లును ధరణీస్థలిం బ్రగల్భస్థలముల్
పల్లేఱు నాగులేఱును
బల్లెత్మకాంత యెల్లప్రారంభంబుల్. 121

సీ. ఇచ్చోట భుజియించి రేకకార్యస్థులై
సామంతనృపతులు చాపకూడు
ఇచ్చోటఁ జింతించె నిచ్చ నుపాయంబు
నళినాక్షి యార్వెల్లినాయురాలు

* యురాలి అని యుండవచ్చును.

నిజ మనుశుద్ధికై నిప్పులయేటిలో
        నోలాడె నిచ్చోట బీలసాని
ఇచ్చోటఁ బోరిరి యిల పణంబుగ గొల్ల
        సవతితల్లులబిడ్డ లవనిపతులు
ధీరులగువార లేవురు వీరపురుషు
లై మదోద్ధతి నిచ్చోట నాడిఁ బడిరి
యనుచుఁ జెప్పుదు రైతిహ్య మచట నచట
జనపపెద్దలు పల్లెదేశములయందు. 122

ఉ. చిత్తము గూర్చి మాచెరల
        చెన్నుఁడు శ్రీగిరిలింగముం గృపా
యత్తతఁ జూడ * ముల్కి విష
        యంబున కామహిమంబు చెల్లఁగా
కుత్తరలోన మింట జల
        ముట్టినమాత్రన నాపతాలలో
విత్తినయావనాళ మఖి
        వృద్ధి ఫలించుట యెట్లు చెప్పుమా ? 123

మ. మగసింగంబులు సంగరాంగణములన్
        మత్తిల్లి రున్మత్తులై
జగదేకస్తుతు లంచు నేమిటికి సం
        శ్లాఘింపఁ నాభూమిలో

*"బల్లె" అని యుండునేమో ?

జిగురుంబో(దుల( గా(పుగుబ్బెతల న
క్షీణప్రభావంబునఁ
మగసింగంబుల(గా నెఱుంగుదురు పుం
భావప్రసంగంబులఁ. 124

గీ. కోలదాపున( ద్రిక్కూటి( గూడియున్న
గచ్చునేసినచిత్రంపుగద్దెపలక
వ్రాసినా రదె చూడరా వైశ్యరాజ!
శీలబ్రహ్మాదివీరనాసీరచరిత. 125

వ. ఈ వీరపురుషులు మనకుం గార్యసిద్ధి నేయుదురుగాక పదపద మనుచుం గతిపయపదంబు లరిగి నింబపల్లవ నికురంబసందానితవందనమాలికాలంకృతద్వారం బగు నేకవీరాగారగోష్ఠంబు గనుంగొని. 126

ఏకవీర

సీ. వందనం బిందిరావరుకన్నతల్లి కి
దండంబు ఫణిరాజమండనకును
నంజలి సోమసూర్యానలనేత్రకు
నభివందనము జగదంబికకును
మొగుపు(జేతులు దేవమునిసిద్ధసేవ్యకు
జమదగ్నిగారాపుసతికి శరణు
జోహారు రమణీయశోభనాకారకు
నమితంబు గిరిరాజనందనకును

నిత్యకల్యాణి కలికులనీలవేణి
కాదిశక్తికి వేదవేదాంతసార
కేకవీరకుఁ బూర్ణరాకేందుముఖికి
నఖిలజననికి సాష్టాంగ మనుదినంబు. 127

సీ. పద్మలోచన భృగుబ్రహ్మసంయమివంశ
పరిపాటి కభినవాభరణ మయ్యె
రమణి త్రేతాద్వాపరములసంధ్యావేళ
మగనితోఁ బెక్కేండ్లు మనువు మనియె
నెలఁత కానకకన్న నెయ్యంపుఁగొడుకుచేఁ
జంపించె ముయ్యేడుసారె నరులఁ
దరుణి హైహయరాజదంతాస్థిపటలంబు
గవదపేరుగఁ జేసి కట్టె నఱుత
మందపాకను, బెనుఁబాక, మాహూరమున,
నాగవరమునఁ, బోలాస నవిచె నింతి
యోరుఁగంట వసించె నీలోత్పలాక్షి
*కాకతమ్మకు సైదోడ యేకవీర. 128

సీ. అలిగి యెంతటిరాజునాంధ్ర సైనను బట్టి
పుట్టుఁబాపలఁ జేయురట్టుకత్తె
ఘనుఁడైనజమదగ్నిమునినాథుకూరిమి
వెలయించుపెనుఁబాకవేడ్కకత్తె

*అనుబంధముఁ జూచునది.

సుక్షత్రియకులంబు నిక్షత్రముగఁ జేయు
కొడుకుఁ గాంచినయట్టికోపకత్తె
బవనీలజవనికపాటల నిల్లాంధ్ర
రమణఁ ద్రుళ్ళాడించురంతుకత్తె
యోలిమి గదుళ్ళవాఁగులో నోలలాడు
కలికిపల్లికదేబెలఁ గన్నతల్లి
వాసి కెక్కినయట్టిపోలాసయిల్లు
చక్కమెప్పులమాహూర మ్మక్కనాచి. 129

బవనీఁడు

సీ. కచనిక్షిప్తవికస్వరస్వరవిలా
సశ్రీనివాసంబు జవని కందుఁ
గట్టినతంత్రికిఁ గంఠశ్రుతికిఁ గూడఁ
జొక్కంబుగా నారి సొబగు మీఱ
నాలాపముల శుద్ధసాళగ సంకీర్ణ
వివిధరాగంబులచవులు చూపి
డమడమధ్వనులఁ బొటూరించి యెడనెడఁ
గత్తెరమార్గంబు బిత్తరిల్ల
వాద్యపై ఖరిఁ గడు నెఱవాది యనఁగ
నేకవీరామహాదేవియెదుట నిల్చి
పరశురామునికథ లెల్లఁ బ్రౌఢిఁ బాడెఁ
జారుతరకీర్తి బవనీలచక్రవర్తి. 130

## మాలెత

మ. అలరుంబోఁడి జనంగమప్రమద మ
ద్యానద్ధఘంటాధ్వనుల్
చెలఁగం బాడె సమస్తలోకజననిన్
శ్రీయేకవీరాంబికన్
వలరా జొక్కొకమూర్ఛనాస్వరమునన్
ప్రాణంబు గల్పింపఁగాఁ
గలకంఠీకలకంఠకోమలకుహూ
కారంబు తోరంబుగన్. 131

మ. అకలంకస్థితిఁ గోరి కొల్చెదరు బ్ర
హ్మానందభావంబునన్
సకలానందమయైకమాత లగుచున్
సంతోషచిత్తంబునన్
తకదుమ్ముల్ యకతాళముల్ జవనికల్
తందాన లమ్మయ్యకున్
ఏకవీరమ్మకు మాహూరమ్మకు నభో
హ్రీంకారమధ్యాత్మకున్. 132

శా. ఆలోకింపక మ్రొక్కరాదు విజభ
క్త్యావేశసంపత్తిమై
నాలోకించినఁ జిత్త మెట్లగునొ కా
మావేశసంయుక్తిమై

నేలా గోయి కిరాట ! మానుదమొ సం
వీక్షింతమో చెప్పుమా ?
ప్రీలాఘాన్యకటీరమండలము దే
వీకంఠశ్రీవ్రాతము. 133

కాపుఁటాలు

సీ. జటివోనిగడితంపుఁ జిఱుతచౌకంబుల
తొగరుఁబుట్టము కచ్చఁ దొడివి కట్టి
యొలగందపుబొట్టు నుపరిభాగంబుపై
సిందూరతిలకంబుఁ బొందుపఱచి
పసరుదారెడునింబపల్లవంబులదండ
గుబ్బచన్నులమీఁదఁ గుదురుకొల్పి
క్రొత్త దోమినదంతకోరకంబులయందుఁ
దాంబూలరాగంబు తళుకు గూర్చి
సకలసంధ్యంగములకుఁ దేజంబు గలుగ
మధుమదారంభ మఱఁకువ మరలఁ ద్రోవఁ
దేఁకువయు నారజంబునుఁ దేటపడఁగఁ
బురమునకు వచ్చె నొకకాఁపుబూవుబోఁడి. 134

వ. అయ్యవసరంబున నేకవీరాంబికుం బ్రణమిల్లి యట
చనునప్పుడు. 135

## జక్కులపురంధ్రి

సీ. కోణాగ్రసంఘర్ష ఘుమఘుమధ్వని తార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టుబోనాన నసలుకొల్పినకన్ను
కొడుపుచేఁ దాటించు నెదపదదప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగ వలయుచోఁ
జెవిత్రాడు బిగియించుజీవగఱ్ఱ
గిల్కుగిల్కున మ్రోయుకింకిణీగుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప
రాగముననుండి లంఘించు రాగమునకు
నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీమహాలక్ష్మి కైటభారి
వలపు వాడుచు వచ్చె జక్కులపురంధ్రి. 136

## అక్కలు

సీ. ముద్రికామాణిక్యములదీప్తి కెంగేలి
పించెంబుఁగుంచెతో బిత్తరింప
నుపవాసమునఁ దద్దయును సన్న నగుకౌను
చనుదోయిభరమున జలదరింపఁ
దోకచుక్కలఁ బోలుతోరంపుఁదెలికన్ను
లాపైశమున సిగ్గు నతకరింప

నిద్దంపు వెలిపట్టునెఱిక దూలినయప్డు
తొడలమించులు వెల్గఁ దొంగలింప
నురుమచప్పుళ్ళకును బిల్లదురుల మ్రోఁత
కంతకంతకుఁ బేరుబ్బు నావహింప
నాడెఁ బీఁటలపై నోలిఁ గూడియున్న
యక్క లేఢ్వురలో నొక్క యలరుబోఁడి. 137

చ. హరహర యింత యొప్పునె మ
హారభటీ జగఝంకృతస్వన
న్మరళివిమిశ్రితాంకరవ
మూర్ఛలఁ జిత్తము లబ్బి యక్క లే
ఢ్వురు నదె యాడఁజొచ్చిరి క
ఢుంగడు వేడ్క సమున్నమత్ప్రయో
ధరయుగభారభీరుతమ
తన్వవలగ్నము లైననృత్యముల్. 138

వ. ఇదె యీ యింటి యజమానుండు సంతానకాంక్షియై ప్రతిబంధనోదనార్థంబు యక్షకన్యలం బరీక్షారాధనంబు నేయుచున్నవాఁడు గావలయు మాటిభద్రకులోద్వహా లైనదేవతలు కామవల్లి శ్రీమహాలక్ష్మితోఁ గూడి యపేక్షితకార్యంబు మనకునవ్యాక్షేపంబునం జేయుదురు గాక యనుచు విశ్వాసంబుతో నమస్కారంబు నేసి

కాసల్నాటిగోవిందమంచనశర్మ నర్మసఖుండు దాను
నట చని ముందట. 139

గీ. మంద్రమధ్యతార మానత్రయాభిన్న
మహిషశృంగనాదలహరిఁ గూడి
డమరు డిండిమంబు డమడమధ్వని మ్రోసె
నద్భుతం బదేమి యార్పటంబు. 140

మైలారభటులు

వ. అని టిట్టిభుం డడిగిన. 141

సీ. అవఅవ మందు నెఱ్ఱనిచంద్రమల్లెల
చోద్యంపుగుండాలు చొచ్చువారు
కరవాఁడియలుఁగుల గనపపాఁతర్లలో
నుట్టిచేరులు గోసి యుఱుకువారు
గాలంపుఁగొంకిఁ గంకాళచర్మము గ్రుచ్చి
యుడువీథి నుయ్యేల లూఁగువారు
కటికిహొన్నాళంబు గండగత్తెర వట్టి
మిసిమింతులును గాక మ్రింగువారు
సందులను నారసంబులు సలుపువారు
యెడమకుడిచేత నారతు లిచ్చువారు
సాహసము మూర్తి గైకొన్నసరణివారు
ధీరహృదయులు మైలారవీరభటులు. 142

గీ. వీరు మైలారదేవఁ వీరభటులు
గొండ్లి యాడించుచున్నారు గొరగపడుచు
నాడుచున్నది చూడు మూర్ధాభినయము
తాను నెట్టికసీలంత గాని లేదు. 143

చ. వెనుకకు మొగ్గవ్రాలి కడు
విన్నను వొప్పుఁగఁ దొట్టెసీళ్ళలో
మునిఁగి తదంతరస్థ మగు
ముంగర ముక్కున గ్రుచ్చుకొంచు లే
చెను రసనాప్రవాళమున
శీఘ్రము గ్రుచ్చెను నల్లపూస పే
రనుపమలీల నిప్పుడు చు
పాయము లిట్టివి యెట్లు నేర్చెనో ? 144

సీ. శనివారసిద్ధి సజ్జనపారిజాతంబు
వరదాత యాదిత్యవారభోగి
మాఁదచీరమడుంగు• మాయావినోదుండు
మాళవీప్రియభర్త మహితయశుఁడు
పల్లెంబనాయకుం దెల్లవేల్పులరాజు
గనపవేఁటలవేడ్కకాంద్రభర్త
కత్రశాలస్వామి కరుణాపయోరాశి
పుణ్యకీర్తను * దైనవ్రోలియయ్య

•రమణుండు
*'అయినవ్రోలి'లో మైలారదేవుని విగ్రహము కలదు. దాని ప్రతిబింబమును శ్రీ గణపతిరాయవర్మగారు సంపాదించిరి.

మంచుకుంచాలఁ గొలువంగ మాయలేళ్ళఁ
బట్టి కట్టంగ నేర్చినబాసవెల్లి
భైరవునితోడిజోడు మైలారదేవుఁ
డోరుగంటినివాసి మే లొసఁగుఁ గాత. 145

మ. అదిగో! యెత్తినవారు పట్టణము మ
ధ్యక్షోణి సింహధ్వజం
బదిగో! కట్టినవారు వింబదశమా
ల్యాతోరణవ్రాతముల్
విదితం బయ్యె మహోత్సవంబు నెఱయన్
వీథీవిటంకంబులం
దదిగో! నిల్పినవారు పూర్ణకలశం
బాబాలవృద్ధాంగనల్. 146

మ. అకలంకస్థితి శీధుపానరుచులై
యాసాదు లుప్పొంగి యో
యకరో యమ్మకరో యమక్కరొ యదీ
యట్టట్టకో యంచుఁ బా
యక తప్పెట్లనుఁ దక్కెతాళములు విం
పై సొంపు రంజిల్లఁగాఁ
జకజాంజుం జకజుంజు జుమ్మ మనుచున్
సాగుం గడున్ వాద్యముల్. 147

వ. అట చని ముందట. 148

## నగరావలోకనము

సీ. అదె భైరవస్థాన మటమీఁద నల్లదె
చమదేశ్వరీమహాశక్తినగరు
వీరభద్రేశ్వరాగారమంటప మదె
యదె బౌద్ధదేవువిహారభూమి
అదె ముద్దరా ల్మసానమ్మనివాసంబు
నల్లదె కొమరసామయ్యనగరు
అదె పాండవులగుడి యట దక్షిణంబునఁ
గర్తారుఁ డుండుతుర్కులమసీదు
కొంతదవ్వుల నదె మహాగోపురముల
పైఁడికుండలు రవిదీప్తిఁ బ్రజ్వలించి
కాననయ్యెను మేరుశృంగములఁబోలెఁ
గేశవశ్రీస్వయంభూనికేతనములు. 149

వ. అనుచు నటచని ముందట నొక్క భైరవాలయంబుఁ బొడ
గనినమస్కరించి కొసల్నాటిమంచనశర్మ యిట్లనియె.

## భైరవుఁడు

మ. అమితోత్సాహముతోడ నీవు పటుదా
హాధక్క నొక్కొక్కమా

టు మనఃకంపము నొందఁ జేయఁ దొలఁకా
డుఁగా వార్ధి వేలాలుఠ
త్కమఠంబై, వలమానమీన మయి, యు
ద్యన్నక్రమై, యుత్తర
త్తిమిమై, యుల్లలదంబుమగ్నధుళియై
ధీరా మహాభైరవా। 151

వ. అని యూర్ధ్వం బవలోకించి యిప్పుడు మధ్యాహ్న
కాలం బగుచున్నయది. 152

## మధ్యాహ్నము

శా. ప్రాలేఁగా దిక్కుల భానుభావ్యతికర
ప్రక్రీడదరోత్కపల
జ్వాలాజాలజటాలజాంగలతటీ
వాచాలకోయష్టులై
రోలంబంబులు మూతి ముట్ట వెఱచేఁగా
గ్రొవ్వేఁడి బీరెండలన్
జాలం గ్రాఁగి కరంబు వేఁడి యగుకా
సారాబ్జమైరేయముల్. 153

వ. అని యనంతరం బాకాశంబునం జెవివెట్టి శ్రుతి నభిన
యించి గోవిందుండు. 154

## గడియారము

మ. ఉడువీథిన్ శిఖరావలంబి యగునం
ద్రోర్వీశు మోసాలపై
గడియారంబున మ్రోసె రెండెనిముదుల్
ఘంటాఘణాత్కారముల్
సడలెన్ భానుఁడు పశ్చిమంబునకు వై
శ్యా! పూఁటకూటింటికిన్
గుడువం బోదమె లెక్కయిచ్చి? కడు నాఁ
కొన్నార మిప్పట్టునన్. 155

వ. విచారించిన నదియును మనకు విశ్రమస్థానంబు 156

## పూఁటకూటియిల్లు

గీ. సంధివిగ్రహయానాదిసంఘటనల
బంధకీజారులకు రాయబారి యగుచుఁ
బట్టణంబున నిత్యంబు పగలు రేయి
పూఁటకూటింట వర్తించుఁ బుష్పశరుఁడు. 157

వ. అనుచుఁ గొంతద వ్వరిగినం దమకు నెదురుగా నేతెంచు
నొక్క బ్రాహ్మణుం గనుగొని. 158

ఉ. పీఁ డిదె తెల్లనాకులను
పీడెము సేయుచు వీథి వచ్చుచు
న్నాఁడు మదించి తిండి తివి
నాఁడు చుమీ యిటమీఁద నేదకో

తేఁదఁగఁ బోయెడిం గరణ
దేశపుజాణఁడు గాఁగఁ బోలు నీ
బాఁడు పణోపహారపరి
పాటి యెఱుంగగవచ్చు నీవిచేః. 159

వ. ఇతఁడు వెడలివచ్చి నవ్వాడయె పూఁటవంటకంబు
వెట్టు బాడబులవాడ గావలయు నది యెట్లంచేని. 160

ఉ. ఘ్రాణపుటీకుటీరములఁ
గాపుర ముండఁ దొడంగె నిప్డు పా
షాణఘరట్టఘట్టనవ
శంబునఁ బుట్టినసత్తుగంధ మ
క్షీణకఠోరసౌరభవి
జృంభణ దిక్కులఁ జల్లఁజొచ్చె సా
గ్రాణిపదార్థజాలములు
బ్రాహ్మణకాంతలు తాలఁ బోయఁగః. 161

గీ. మందవేగంబుతోఁ గ్రొత్తమలఁకవాళ్ళ
కిఱ్ఱుచెప్పులు మొరయ నుంకించి నడుచు
కరణబ్రాహ్మణవిటముఖ్యుఁ గదియ వచ్చి
పూతిమాషాన్వయుం డగుభూసురుండు. 162

వ. పూఁటవంటకంబుల వృత్తాంతం బడిగిన నతండు. 163

క. ఆహారవిహారములకొ
యాహారంబునకునో విహారంబునకో
బేహారము మీ కీసం
దేహారంభంబు మాకుఁ దెలియఁగ వలయున్. 164

వ. ఆహారంబున కంచేవి 165

ఉ. కప్పురభోగివంటకము
కమ్మనిగోధుమపిండివంటయున్
గుప్పెఁడుపంచదారయును
గ్రొత్తగఁ గాఁచినయాలనే పెన
ర్పప్పును గొమ్మునల్లనఁటి
పండ్లును నాలుగు నైదు నంజులున్
లప్పలతోడఁ గ్రొంబెరుగు
లక్ష్మణవజ్ఝలయింట రూకకున్. 166

వ. విహారంబున కంచేవి దద్గృహంబున. 167

క. అఱుగొను గుబ్బచన్నులు
మెఱుఁగుంగన్నులును గలుగుమెచ్చులనవలా
కుఱుబోద ముందరత్నము
బఱివోవఁగ విడిచినట్టిబ్రహ్మకు జేజే. 168

శా. పూవుంబోఁడులు లేరె విప్రవిధవల్
భూమండలిన్ దానిరే

భాపై దగ్ధ్యవిలాసవిభ్రమకళా
గర్వంబు లె ట్లుండనీ
యావిశ్వస్థ యుపస్థచాయ నవల
క్షాధీశ ఫాలస్థలీ
సౌవర్ణస్థిరపట్టబంధసుషమా
సౌభాగ్యలక్ష్మిన్ గనున్. 169

ఉ. కోయిల పంచమస్వరము
క్రోల్చినభంగిని విద్దికంచి రా
మాయణ మాటుకాండములు
నచ్యుతజాగరవేళఁ బాడె నా
రాయవితంతురత్న మను
రాగముతోఁద "నమశ్శివాయ శాం
తాయ సమస్తదోషహర
ణాయ" సమానమె దాని కెవ్వరున్? 170

ఉ. సంకృతిపూతిమాషకుల
సాగరశారదపూర్ణిమాకురం
గాంకుఁడు మంచి లక్ష్మణుగృ
హంబున నెచ్చెలికాఁడుఁ దానునుం
జంకెలబంటిగా మెసవి
చక్కని వేడుకకత్తెఁ జూచి తా
రింకొకమాట వత్తమని
యేఁగిరి కార్యభరంబు పెంపునన్. 171

వ. ఆట వోవంటోవ ముందట. 172

గేదఁగిపూవు

సీ. పాంథసీమంతినీ ప్రాణమత్స్యములకు
గాలాము లగుకంటకములతోడ
గరుడపచ్చలచాయఁ బరిహసింపఁగఁ జాలు
దళ మైనబాహ్యపత్రములతోడ
జీర్ణకీకసకణశ్రేణిఁ జిద్దలు చేసి
యవియఁదోమినయట్టియన్నతోడఁ
బదియాఱువన్నియబంగారు సరివచ్చు
సంవర్తికాపలాశములతోడ
శివునిచిచ్చుఱకంట వెచ్చినయనంగు
బూది కెనయైనకమ్మబుప్పొళ్ళతోడ
దావి ఘన మైనకమ్మగేదంగిపూవు
భూసురున కిచ్చెఁ దగ నొక్కపుష్పలావి. 173

వ. ఇచ్చినం జూచి 174

ఉ. క్రొన్నెలరేఖతోడఁ గెదఁ
గూడి సుఖింపగఁ భాగ్య మబ్బమిఁ
ఖిన్నత నొందుఁ గాని నవ
కేతకి శూలి వివేకహీనుఁడై

తన్నుఁ దిరస్కరించుటకు
దైన్యము నొంద దదే వివేకసం
పన్నిధి దానిపాలిపెరు
మాళ్కొకఁ దెక్కడనైన లేఁదొకో? 175

గీ. అందుకొని పుష్పలావికిఁ ద్యాగ మిచ్చి
బ్రాహ్మణుల కందు నొక్కొక్కపత్ర మొసఁగి
జాణవిప్రుండు సిగఁ దాల్చెఁ జందమామ
కొండనాలిక యగునొక్క గొమలిఱేకు. 176

* * *

వ. అదె విద్వేషిభువనజిగీషాసంరంభవిజృంభమాణ ఝష
ధ్వజభుజపరాక్రమసముత్సాహనాటకప్రస్తావనా ప్రథమ
నాందీశ్లోకం బగువేశవాటికానికటంబు. 177

గీ. చందనంబునఁ గలయంపి చల్లినారు
* ముగ్గు లిడినారు కాశ్మీరమున ముదమున
వ్రాసినా రిందురజమున రంగవల్లి
కంజములఁ దోరణంబులఁ గట్టినారు. 178

వ. ఇది యెవ్వరియిల్లొకో! శోభనంబు మొదవడుచున్న
యది యనుచు నాకాశంబు వీక్షించి యచ్చటివారల
నేమి యని యడిగిన. 179

* ఇట గ్రంథపాఠ మేమో ?

మాచల్దేవి

శా. ద్వీపాంతంబున నుండి వచ్చితివె ? భూ
దేవా ! "ప్రశాంతం మహా
పాపం" సర్వజగత్ప్రసిద్ధసుమనో
బాణాసనామ్నాయవి
ద్యోపాధ్యాయి ప్రతాపరుద్రధరణీ
శోపాత్తగోష్ఠీప్రతి
ష్ఠాపారీణ నెఱుంగ వయ్యెదవె మా
చల్దేవివారాంగనన్ ? 180

వ. చిత్రశాలాప్రవేశంబు చేయుచున్నయది పుణ్యాహవాచన కాలంబు మీరునుఁ బచ్చని పెండ్లికూటంబుఁ జూడవచ్చు నది యనిన. 181

గీ. లెస్సగాక కిరాట ! యీ లేమచరిత
మాడుదురు నాటకంబుగ నవవిలోన
దీని జూడంగఁ బోదమా యీనెపమున
నరసి చూతము మన కేమి యచట ? ననుచు, 182

వ. అనుచుఁ బ్రవేశనాటితకంబునఁ జిత్రశాలఁ జొచ్చి పూతి మాషగోత్రుం డచ్చోటం బెండ్లికూటంబున విలువునం గై సేసి హంసతూలికాతల్పంబుమీఁదం గూర్చున్న హావ భావ విభ్రమవిలాసవిధి మాచల్దేవిఁ గనుంగొని. 183

గీ. అంకుశాఘాతరేఖల నంద మొందు
గంధగజకుంభములతోడఁ గలహమాడు
క్రొత్తనఖములతోడి నీ కుచభరమున
కతివ యభ్యుదయపరంపరాభివృద్ధి. 184

గీ. కల్లఁ జెప్పము విను నీకుఁ గలప్రసిద్ధి
ఢిల్లిసురతాణికిని లేదు పల్లవోష్ఠి!
యాదిలక్ష్మికి నీకును భేద మేమి
యుదధి జనియింపకుండుట యొకటి దక్క. 185

గీ. ఓరుఁగంటిమాచాంబ పయోరుహాక్షి
పంచబాణావతారుని మంచిఁ జూచి
కంకణాలంక్రియారుణాత్కార మెసఁగ
"నయ్యగారికి జోహారు" లనుచు మ్రొక్కె. 186

గీ. అగురుధూపాదివాసితాభ్యంతరంబు
మగువ నీమన్మథచ్ఛత్రమంటపంబు
సర్వయోషిదసామాన్యసౌష్ఠవంబు
కాచుఁ గావుత మోర్గంటికటకవిటుల. 187

వ. అనుటయు. 188

సీ. ఎందుండి వచ్చితి రీరు? కొసల్నాట
నుండి వచ్చితిమి మే ముత్పలాక్షి

యెవ్వరివారు మీ ? రేము సంకృతి పూతి
మాషమాధవునికుమారవరుఁడ
మీదివ్యనామకరం బేదియో ? గోవింద
మంచనశర్మసమాహ్వయులము
మీర లిచ్చటికి రాఁ గారణం బెయ్యది ?
చేరి మీబోంట్ల నాశీర్వదింప
నైన విచ్చేసి కూర్చుండ నవధరింపు
వార్చి వచ్చెద మటు వోయి వనరుహాక్షి
యెచ్చటికి వార్వఁ బోయెద రెఱుఁగజెప్పుఁ
డక్కవాడకు మేము బ్రాహ్మణుల మగుట. 189

ఇక్కడ గ్రంథపాతము ?

వ. చిత్రావలోకనంబు చేసి టిట్టిభునకు గోవింద మంచన
శర్మ యిట్లనియె. 190

చిత్రశాల

సీ. అదె దారువనభూమి, యసమనేత్రుఁడు వాఁడె,
సంయమీంద్రులపుణ్యసతులు వారె,
యదె కన్యకారత్న, మబ్జాసనుఁడు వాఁడె,
యదె రతిక్రీడావిహారశయ్య,
వాఁడె వైకుంఠుండు, వారె గోపస్త్రీలు,
యమునానదీపైకతాంత మదియె,

అదె యహల్యాదేవి, యమరాధిపుఁడు వాఁడె,
యదె పర్ణశాలికాభ్యంతరంబు,
చందురుఁడు వాఁడె, యదె బృహస్పతిపురంధ్రి,
జాలరియు నదె, శ్రీపరాశరుఁడు వాఁడె,
కుశికజుఁడు వాఁడె, యదె యింద్రుకొలువులేమ,
చిత్తజానిశౌర్య మెఱిఁగించెఁ జిత్రశాల. 191

ఉ. తియ్యవివింటిజోదు రతి
దేవిచనుంగవ నొత్తిగిల్లి యొ
య్యొయ్యన వంక చక్కఁబఁడ
నొత్తెనుఁ జూచితె పుష్పబాణముల్
మయ్యెర వ్రాసెఁ జిత్తరువు
మాఁగిలి మాఁగిలి; చిత్రకారుఁడా!
దయ్యము గాక; నీవిపస
దానము టెట్టి థ! వీని కిఁదగుణా. 192

వ. అనుచుఁ దద్గృహంబు నిర్గమించి పూర్వానుభూతయగు గాంధర్విగృహంబు రోయువాఁడు కతిపయమందిరంబులకు నవల సింహవారలతికాకుడుంగం బడియాలంబున నెఱింగి యనుంగు మొగసాలం జొచ్చిన దాసదాసీజనంబు ససంభ్రమంబుగా నెదురేఁగి తోడ్కొని పోవం బోయి యభ్యంతరమందిరంబున మహోత్సవవ్యాపార

పారీణయై యన్నయవ్వారముఖ్యం జేరి యాసనార్ఘ్య
పాద్యాదిసముచితసత్కారంబులం బొంది సుఖాసీనుండై.

మకురవీక్షావిధి

ఉ. గోత్రమువార లెల్లఁ గెడ
గూడినవారు వ్రతంబొ; దేవతా
యాత్రయొ; పండువో; మనగృ
హంబున శోభన మేమి ? శోభనం
బత్రిసమాన! నేఁటియప
రాహ్ణసమాగమవేళఁ బుష్యన
క్షత్రమునందు నీయనుఁగు
గాదిలికూఁతురు చూచు నద్దముఁ. 194

క. ఆవేళ నీవు బిడ్డకు
దీవనమంత్రంబు చెప్ప దీర్ఘాయు వగుఁ
లావణ్యంబు వివేకము
ప్రావీణ్యము వైభవంబు భాగ్యము గలుగుఁ. 195

గీ. ముకురవీక్షావిధానంబు మొదల లేక
వెలపడంతికిఁ గారాదు విటునిఁ గవయ
యాయజూకున కెట్లు చేయంగవచ్చు
వరణిసంగ్రహ మొనరింప కధ్వరంబు ? 196

గీ. లంజెవారికి శ్రీమహాలక్ష్మి గాదె
దర్పణము విప్రముఖ్యగంధర్వగణము
పుణ్యచారిత్ర దృష్టాంతభూమి గాదె
దర్పణమ్మ వివర్తవాదముల కెల్ల. 197

ఉ. ఉన్మదమత్తకోకిల కు
హూకలపంచమరాగరాగసం
పన్మహనీయ మైనమధు
మాసపుఁబున్నమనాఁడు బిడ్డకుఁ
మన్మథవేదదీక్ష పది
నాళ్ళగుమాత్రము నేతదర్థమై
సన్మతి నుండఁగావలయు
జక్కనివాఁడవ యక్కవాడలోఁ. 198

సీ. అదె నీకుమారిత మదనరేఖాకన్య
వదనరేఖావైభవమునఁ జంద్రు
దొరఁ గూర్చికొన్నది ధూర్తదేవత విన్నుఁ
దంద్రిఁ బోలినయట్టితరళనయన
సాముద్రికాగమజ్ఞానపారీణులు
కడు భాగ్యసంపద గలది యంద్రు
భాగ్యసంపదకల్మి ప్రస్ఫుటం బయ్యెఁగా
మీర లిందుల వచ్చి మీటియుంట

జనకుఁడవు కర్త వొజ్జవు సజ్జనుఁడవు
క్రొత్తలంజెలకాముండ వుత్తముఁడవు
తొడల నిడుకొని ముద్దుకూఁతునకు నీవు
మించుటద్దంబు చూపరా మంచిరాజ! 199

గీ. కేలఁ గ్రొమ్మించుటద్దంబు గీలుకొల్పి
మంచితొడమీఁద నొప్పారె మదనరేఖ
ముద్దునెమ్మోము లావణ్యమున జయించి
కువలయాప్తునిఁ జెఱవెట్టుకొన్నకరణి. 200

క. దీవించి మంచి కూఁతురు
"శ్రీవర్ధస్వంబు" చెప్పి చెవి టిట్టిభనె
ట్టీ! వెస నిప్పింపుము సం
భావన నొకవెండి బిడ్డపసపున కనియెన్. 201

వ. అనంతరంబ గాంధర్వ పూర్వసంబంధంబున నైన ప్రేమానుబంధంబునఁ గేలు గేలం గీలించి యిట్లనియె.

గీ. ఎందు పోయితి గోవింద! మున్దరట్ల
యెంద అతివల వలపించి తెచట నెచటఁ
దలఁపు పుట్టించెనే నీకు దైవ మిట్లు
పాయసం బారగించినప్రాఁతపట్టు. 203

## శ్రీకాకుళపుఁదిర్నాళ్ళు

గీ. *దవనపున్నమఁ గాకుళాధ్యక్షుఁడైన
తెలుఁగురాయఁడు దేవతాధీశ్వరుండు
భువనహితముగ నుత్సవం బవధరింప
నందుఁ బోయితి మీపోయినట్టియేఁడు. 204

గీ. కారవేల్లమతల్లికాకల్పవల్లి
కడుపు పండారఁ గాంచినకొడుకుఁగుఱ్ఱ
జారచోరమహాధూర్తచక్రవర్తి
దేవవేశ్యాభుజంగుండు తెలుఁగుభర్త. 205

గీ. పసిఁడికోర వేఁడిపా లారగించినఁ
బొల్లసిలినయధరపల్లవమున
విప్రకన్యచనువు వెలయించుచున్నాఁడు
విశ్వమునకుఁ గాకుళేశ్వరుండు. 206

ఉ. ఈరస మెత్తు వేదములు
ప్రోఁ వహింయించుఁ బురాణసంహితల్
సౌరభహీన మౌ నుపని
షత్తులు లేఁబడు నాగమావళుల్
గారవ ముల్లసిల్ల సిరి
కాకుళనాథుఁడు నాగదేవత

*అనుబంధముఁ జూచునది.

ట్టారకునింటఁ బుట్టి ప్రక
టంబుగ వేడుక నాదరింపఁగన్. 207

స్ర. గరుడస్తంభప్రతిష్ఠాకలన మొదలుగాఁ
గల్పమంత్రోక్తపుష్పా
ధ్వరపర్యంతంబు కృష్ణాతటివితటమునన్
ద్వాదశక్రోశధాత్రీ
పరివేషాభ్యంతరశ్రీపరమపదమునం
బర్వకాలంబునందున్
బరనారీసంగమాదుల్ భగవదనుమతిం
బాపముల్ గాక యుండున్. 208

శా. వ్యామగ్రాహ్యనితంబబింబకుచసంభా
రాభీలభద్రాకృతుల్
కామాంధల్ వెలనాటికోడెవిధవల్
కాకొల్ని తిర్నాళ్ళలో
*నామాంధాళ్ల భీమవేమఁడు హిడిం
బాధీశ్వరుం డోపునో
యేమో కాని తెమల్పనేర రితరుల్
హేలారతిక్రీడలన్. 209

---

*మాంధాతృఁడు.

ఉ. పేర్చినసందడిం బెదవి
 పీల్చి రయంబునఁ జిమ్ము లొత్తి చే
దూర్చి యనంగమందిరము
 దూఁకొని కూరిమిఁ బీరు జఱ్ఱనన్
గార్చుకొనంగఁ జేసి యిఱుఁ
 గౌఁగిట నుప్పర మెత్తి యేటికిం
దార్చి రమింతు రూళుల వి
 తంతువులం దిరునాళ్ళపల్లవుల్. 210

క. ముంజెపద నైనళంబర
ఘంజను గేహములు గలుగుబ్రాహ్మణవిధవా
పుంజము లుండఁగ నూరక
లంజియ లేమిటికిఁ గాకుళయతిరునాళ్ళన్. 211

సీ. జవరాలిఁ బొడగన్న సన్న్యాసిపై నేయుఁ
 దులసిలేఁజిగురాకుఁదూపు మరుఁడు
వేదవిప్రునిఁ గన్నవిధవపై ఝళిపించు
 ధర్భపల్లవహేతి దర్పకుండు
కటకారకులకన్యఁ గనినహాళికుమీఁదఁ
 బొడుచుఁ బూమునికోలఁ బుష్పశరుఁడు
నాదింధమునిఁ గన్ననాతిపై నేయును
 నలరుజిచ్చుఱకోల నంగభవుఁడు

బెరసి వెన్నెల గాయంగఁ బేరకమ్మ
పులినతలముల నాయాయికొలము లెఱిఁగి
తాల్చు శస్త్రాస్త్రములు జారదంపతులకు
ననమబాణుండు తిరునాళ్ళ నన్నినాళ్ళ. 212

వ. అని యనంతరంబ యాముందటం జనుదెంచువితంతు
సమూహముం గని యాశీర్వదింపవలయు ననీ. 213

వితంతువులు

సీ. చెలఁగి చెలఁగి పొత్తిచీరలు గట్టెడు
మానకమ్మకు దీర్ఘమాయు రస్తు
సారెసారెకు దేవసదనంబులకు నేఁగు
చెడిపెకు సంకల్పసిద్ధి రస్తు
నిత్యంబు వ్యభిచారనిష్ఠతో నుండెడు
విధవకుఁ బుత్రాభివృద్ధి రస్తు
దళముగాఁ దులసిపేరులు ధరించినయట్టి
విశ్వస్త కారోగ్యవిభవ మస్తు
మిండముండకు సంపత్సమృద్ధి రస్తు
పరచుతెంపికి నిత్యసౌభాగ్య మస్తు
వదరుఁగల్కికి నీప్సితావాప్తి రస్తు
బలువితంతుకు మైథునప్రాప్తి రస్తు. 214

వ. అని యట చనునప్పుడు. 215

(ఇక్కడ కొంత గ్రంథపాతమై యుండును.)

వ. అవిన గాంధర్వి పరదేశపట్టణంబుల వితంతువులచేత వశీకుట్టనంబు సేయించుకొన మరిగి నీవెట్టు మమ్ముం దలంతువు పదపద విచ్చేయు మనుచు నీర్ష్యాకుటిలం బగుకటాక్షంబునం జూచిన. 216

చ. లవలవఁ జన్నుదోయి గద
. లఁగా దొలుకారుమెఱుంగుఁదీఁగలం
గవకవ నవ్వుడాలుదెలి
కన్నులమించులు చౌకళింపఁగా
నవనవయౌవనంబు గల
నాఁటిభవత్పురుషాయితోద్ధతుల్
శివశివ యెన్నిభంగులనుఁ
జిత్తములో మఱవంగ వచ్చునే ? 217

వ. కార్యాంతరవ్యాసంగంబున నార్యవాటికిం బోవుచున్నవాఁడ మనమదనరేఖాకన్య దర్పణావలోకముహూర్తంబు సుముహూర్తం బయ్యెడుఁ బోయివచ్చెద నని. 218

నాగసౌరము

గీ. వెడలి పశ్చిమదిశ నాల్గుగడియ లంత
ప్రొద్దు గలుగంగ నడువీథిఁ బోయి పోయి
కేళినఖుఁడును దా నాలకించి చనియె
నాగసౌరముల[మ్రో]ఁత యన్నాగరికుఁడు. 219

పాములాట

క. నాగస్వరసుషిరసర
న్నాగవరాళ్యాదివివిధనానారాగ
ప్రాగల్భ్యప్రకటఫణా
భోగములై యాడఁదొడఁగె భోగీంద్రంబుల్. 220

సీ. కద్రూమహాదేవిగారాపుసంతతి
మధుకైటభారాతిమడుఁగుఁబాన్పు
కాలకంఠునియంఘ్రిగండపెండారంబు
భానుమంతునితేరిప్రగ్రహంబు
నక్షత్రవీథినెన్నడిమిపెద్దగ్రహంబు
మూలాలవాలంబు మొదటిదుంప
యాదిభైరవదేవు యజ్ఞోపవీతంబు
క్రీడావరాహంబు తోడిజోడు
యర్కనందనుపెలకట్టె యంపకోల
పులుఁగురాయని తాత్కాలపుణ్యభిక్ష
కేతకీపుష్పవాసనాకృత్రిమాసి
పర్వతేంద్రంబుతరిత్రాడు పాపఱేఁడు. 221

వ. ఇమ్మహానాగంబులు మనకుం గార్యసిద్ధి యొసఁగుం
గాక యని చని ముందట. 222

సీ. కడఁగోరఁ దీర్చినకస్తూరిగీర్బొట్టు
నెక్కసక్కెంబుగాఁ జిక్క మెఱయ

నర్థంబు త్రికటంబు నై యురస్స్థలమున
గంధసారస్థాసకములు మెఱయ
జాల విగ్గులు గుల్కుపాలతెక్కలకుచ్చు
వామకర్ణంబుతో వక్కళింపఁ
బెనచి వెంద్రుకలతోఁ బెనవెట్టి చుట్టిన
ప్రాఁతచెంద్రికవన్నెపాగ యమర
జన్నిదంబుగఁ బెనుఁబాము సవదరించి
యంత్రికటకంబు ఘల్లుఘ ల్లనుచు మొరయ
నాహితుండికగరళవిద్యాధిరాజు
వచ్చెఁ బాములమెంగఁడు వదరులాఁడు. 223

సీ పూత్కారపవనంబు పూరించుపుక్కిళ్ళు
మునిఁడిపందులతోడ ముద్దుఁ గురియ
సందిటిసంకుపూసలసద్దు కటు తుంబి
నాదస్వరోజ్జృంభణముల నడఁప
నేదురంధ్రమ్ములు విరుఁగేల వ్రేళ్ళను
వివృతిసంవృతిలీల విస్తరింప
నాలాపతాళాంతరాంతరంబులయందు
వి క్కనుశబ్దముల్ చొక్కటముగ
నాగసింధుప్రభేదనానావరాట
రాగగంధర్వలహరికారంభణముల
మిహిపదంబుగఁ బాములమెంగఁ డూఁదె
భోగిరాజులు వర్తింప నాగబొరము. 224

వ. అట చని ముందట నొక్క మంటపంబున విటభట పటలంబు నెదురుకట్ల నార్పుటింప టిట్టిభుండు విని గోవిందశర్మ నడిగిన. 225

గడిఁడు

సీ. నున్ననై నలుపెక్కి నొసలిచేరువకంటి
కెఱువ పై చినశిఖ పెకలుచుండఁ
గరసానఁ దిగిచినకలివెగందపుబొట్టు
తిరి కట్టుకొని మోము దిరిగియుండఁ
దటపెట దిమికిట ధ్వను లోలిఁ బుట్టింపఁ
జాలుగుమ్మెట చంక వ్రేలుచుండ
నలుకనై మీఁజేత నంటినయాక్రొత్త
మువ్వలత్తెము సారె మలుగుచుండ
నొసలు ప్రుక్కించు నావుర్న నోరు దెఱచు
గ్రుడ్లు మిడికించు రాగంబు గుమ్మడించుఁ
బాదుగతులకుఁ దను దానె పరఁగి యాడు
నల్లయాతండు వో తూర్పునాటిగడిఁడు. 226

## మేషయుద్ధము

వ. అనుచు నట పోవఁ గంటె కిరాట! రెండు మేష కంఠీరవంబులు వీరాటరేవున వీరను ముంచి నస్యంబు సేయుచుఁ బెంచుటం జేసి ధేనువుల నముదావసంబు

వేయువత్సంబులుంబోలె వాత్సల్యంబునం దనయేలికల వెంటఁ గంఠగ్రైవేయ ఘంటికాటంకారంబులును విషమ విషాణకోటిఘటితకపాలాయసాశ్వత్థపల్లవగుళుచ్ఛరింఛోళికాఘణఘణాత్కారంబులు చెలంగ యుద్ధక్రీడాసన్నద్ధంబులై వచ్చుచున్నయవి యీసజీవమ్యూతంబుచూతము కాక యనుచుఁ గౌతూహలంబున నిలిచియున్న యవసరంబున వాహ్యాలిప్రదేశంబునం బందెగాండ్రు పందెంబు నొడిస్సి తలపెట్టిన. 227

చ. ఉభయము భావవీథి జయ
మొందినభంగి భయం బొకింత లే
కభిముఖ మయ్యె వెన్వెనుక
కై యట కొన్నిపదంబు లేఁగుచుఁ
రభసముతో దువాళి గొని
గ్రగ్గునఁ దాఁకెఁడు జూడు సెట్టిటి
ట్టిభ ! ధిధీ యనంగను గ
డింది నదభ్రము లీ యురభ్రముల్. 228

క. నిటలమ్ము లవిసి నెత్తురు
సొటసొట వడియంగ సమరశూరోత్తములై
కటుకునను మొందుతగరులు
చటులాటోపమున రెండు సరిఁబడఁ బోరెన్. 229

గీ. పట్టివెదురుమోపు వైచినచందాన
గుండు గుండుమీఁదఁ గూలినట్లు
కదిఁదిద్రోఁత మేషకంఠీరవంబులు
తాఁకి తాఁకి తప్పి తట్టువాఱె. 230

వ. ఇట్లు తట్టువాఱిపో ట్టేళ్లు నాస్కందం బుడిగి మం
దనిశ్వాసోచ్ఛ్వాసంబులై డిల్లపడి మూర్ఛిల్లిన. 231

సీ. హా హా! నృపాలసింహాసనాధిష్ఠాన
రత్నకంబళకాభిరామరోమ!
మజ్ఝా! కృపీటసంభవమహాదిక్పాల
హేలావిహారవాహ్యాళివాహ!
మాయురే! ప్రవిలంబమానాండసంపాత
కుతుకానుధావితక్రోష్టురాజ!
అహహ! శ్రీవీరభద్రావతారమహేళ
విహతదక్షకబంధనిహితవదన!
భళిరె! మేంఠరాజ బాపు రురభ్రేశ!
ఔర! యేడకేంద్ర యరరె తగర!
మమ్మ హుంక్రియాభిమానాదరిద్రాణ!
మేలుమేలు గొఱ్ఱెమిండగీఁడ! 232

వ. మీకు పీగండంబులు దొలంగుం గాక యనుచు నట
చని ముందటఁ గడవిలంబితతామ్రచూడులగుస్నూడు

